అందరికి నమస్కారం . నా పేరు వంజరీ వినీల్ . నేను 2020 లో ధ్యానంలోకి వచ్చినా ఒక్క ఎడాది తరువతా క్రమం క్రమంగా సాధన చేయడం తగ్గింది . కొన్నీ నెలలకు పుర్తిగా మానేయడం జరిగింది .

2024 - మే నేలలో మళ్లి ధ్యానం మొదలు పెట్టడం జరిగించి . ఒక నేల రోజుల పైగానే నేను ధ్యానం చెయ్యడం జరిగింది , ఇంకా చేస్తున్నాను. ఈ నేల రోజుల్లో నాలో, నా ప్రవర్తనలో కొన్ని మార్తులు జరిగేయి .

( 1 ) ధ్యానానికి ముందు నాకు కాలేజీ ఉంటే ఉ : 6 లేదా 7 గంటలకు ,కాలేజీ లేకపోతే 9 లేదా 10 గంటలకు నిద్ర లేచేవాడిని .

ధ్యానానికి తరువాత ఉ 3 లేదా 3:30 గంటలకు లేచి స్నానం చేసి ధ్యానం చేస్తున్నాను.

( 2 ) ధ్యానానికి ముందు ధన సంపాదన మీద ధ్యాస వుండేది .కాలేజీలో చదువుతున్నా, ఇంటి నుండి తెచ్చుకున్న డబ్బులను ఆదా చేసి స్టాక్ మార్కెట్ లో పెట్టడం, నాకు ఉన్న సమయాన్ని ,ఈ ధన సంపాదన , ధన ఆదా , మనీ మ్యానేజ్మెంట్ (money management ) కీ సంబందించిన విడియోలు చూడటం చేసే వాడిని.

ధ్యానానికి తరువాత జ్ఞాన సంపాదన మీద ధ్యాస ఉంది .జ్ఞానానికి సంబందించిన విడియోలు చూడటం, ఆధ్యాత్మిక సంబంధమైన పుస్తకాలు చదవటం .వీటి కోసం నా సమయాన్ని వెచ్చిస్తున్నాను.

( 3 ) ధ్యానానికి ముందు సెలువు వున్న రోజు ఎక్కువ సమయం Instagram reels లేదా Youtube short చూస్తువుండేవాన్ని , అర్థం పర్థం లేనటువంటి ,పనికి రానటువంటి reels చూస్తువుండేవాన్ని , అపుడపుడు రోజులో 12 గంటలదాక చూసేవాడిని.

ధ్యానం తర్వాత చాలా తగ్గించాను, గంట లేద రెండు గంటలు reels చూస్తున్నారు, ఆ గంటలో కూడా ధ్యానానికి , ఆత్మ జ్ఞానపరమైన reels కూడా చూస్తున్నాను .

( 4 ) ధ్యానానికి ముందు పట్నం నుండి ఇంటికి వచ్చినప్పుడు రోజంతా Phone వాడుతూ , సినిమాలు చూడడం చేసే వాన్ని సమయాన్ని దుర్వినియోగం చేసే వాన్ని,తల్లిదండ్రులకు ఎటువంటి సహాయం , సహకారం చేయ్యకుండ వుండే వాడిని .

ధ్యానం తర్వాత ఇంట్లో పనులు చెయ్యడం , ఇంటి కావాల్సిన సరుకులు అవసరం వన్నపుడు తెవడం , మా దుకాణానికి వెళ్లడం,కుటుంబ సభ్యులకు వండి పెట్టడం, ఇలా మా తలిదండ్రులకు అవసరం ఉన్నప్పుడల్లా నా వంతు సహకారం అందిస్తున్నా.

( 5 ) సేవ : - ధ్యానంలోకి  రాక ముందు ప్రపంచిక సేవ మా తరగతుల వారికి చేసేవాన్ని , Record Collect చేసీ prints, Spiral binding చేయ్యడం , అందరికి  దాహం అయితుందని మిత్రతో కలిసి కుండ కోని, నీలు తెచ్చివ్వడం , కాలేజీ  కోసం NBA అప్పుడు రాత్రి 7  దాక పని చేసే వాడిని  .

ఇప్పుడు ఇలా తెలిసిన  జ్ఞానాన్ని వ్రాసి పంచడం , social media  లో గురువుల జ్ఞానాన్ని పంచడం చెస్తున్నాను .

( 6 ) శరీర  శుబ్రత : - ధ్యానానికి ముందు సెలువుల సమయంలో 2 - 4 రోజులకు ఒకసారి స్నానం చెయ్యడం , పరిశరాలను ఆశుబ్రంగా వుంచడం చేసేవాడిని ,

ఇప్పుడు రోజుకు 1 లేద 2 సార్లు స్నానం చెయ్యడం , శరిరాన్ని శుబ్రంగా వుంచుకోవడం , పరిశరాలను  ముందు కంటే ఇప్పుడు ఎక్కువ శుబ్రంగా వుంచుకుంటున్నాను .

( 7 )ధ్యానానికి ముందు విగ్రహారాధన చేసేవాడిని , మా కుటుంబంతో పోల్చుకుంటే అందరి కంటే నేనే ఎక్కువ భక్తితో వుండేవాడిని , రోజు ఉదయం విగ్రహాన్ని దైవం అని అనుకొని శ్రద్ధతో ,భక్తితో పూజలు చేసేవాడిని , ఆ పూజలు చేస్తు నేను ఎంతో పుణ్యం పొందుతున్నాను , ఎదో సాదిస్తున్నాను , ఆ భగవంతుని అనుగ్రహం పొందుతున్నాను అని అనుకునే వాడిని .

ధ్యానంలోకి వచ్చక  " విగ్రహాన్ని  దైవం అనుకున్నాంత మాత్రన దైవం అయిపోదు , విగ్రహం విగ్రహమే అసలు సిసలైన దైవం నా దేహం లోనే ఆత్మ రూపంలో వుంది “ అని తెలుసుకున్నాను . ఎప్పుడైతే ఈ విషయం నాకు అర్ధమయిందో విగ్రహాన్ని వదిలిపెట్టి శ్వాస మీద ధ్యాస ధ్యానం చేస్తు అంతరంలోకి ప్రవేస్తున్నాను , ధ్యాన స్థితిలో సత్యమైన ఆత్మతో , దేవంతో వుంటున్నాను .

( 8 )ధ్యానానికి ముందు నాలో భయం వుండేది . నాకు ఎటువంటి సమస్య వచ్చినా , తల్లిందండ్రులకు చెప్పాలాంటే భయం “ ఎమంటారో , తిడుతారో “అని . మనస్సులోని మాట బయటకు చెప్పాలంటే భయం . ఎటువంటి సమస్య వచ్చినా కుమిలి పోయేవాడిని .  రాఘువరావు గారి జూమ్ క్లాస్  కీ  వెళ్ళాలి అంటే “ఎవరు ఏమని అనుకుంటారే , ఎంటి ఇంత కాలం తరువాత వచ్చావు అంతరు “అని జూమ్  క్లాసులకు వెల్లకుండా Youtube లోనే రాఘువరావుగారి సందేశాలు వినేవాడని.

సాధన చెయ్యగా - చెయ్యగా నాలో భయం పోయింది . ఎటువంటి సమస్య ఎదురైనా తల్లిదండ్రులతో ప్రస్తావించి , పరిష్కారం తెలుసుకోని , సమస్య నుండి భయట పడుతున్నాను .  ఉదయం లేచి  జూమ్ క్లాస్ లో పాల్గొంటున్నాను , గురువుగారితో మాట్లాడుతున్నాను .